లోక : నిజమే. అందున్నది నీవే! కాని నీవందున్నది మా కొరకు!

శ్రీరంగ : మీరన్నచో భక్తులుకదా! ఆలయము, భక్తులు ఉన్నది నా కొరకే కదా!

లోక : నీకొరకు కాదు మేము! మా కొరకు నీవు! మా సంరక్షణార్థము. మా సంపోషణార్థము. నీవున్నది మా కొరకే !

శ్రీరంగ : మరి మీరున్నది - ?

లోక : మా కొరకే!

శ్రీరంగ : మీ పూజలన్ని - ?

లోక : మా కొరకే

శ్రీరంగ : ఈ పూజ లెవరిని చెందనుద్దిష్టాలు?

లోక : నిన్నే - కాని మా తృప్తి కొరకు, మా ఆనందమునకు.

శ్రీరంగ : మీ కానందము లేదా?

లోక : లేకపోవచ్చు.

శ్రీరంగ : దుఃఖము?

లోక : ఉండవచ్చు

శ్రీరంగ : దుఃఖనివారణార్థమే?

లోక : అవును - అందుకే పూజలు స్తుతులు. ఈ ఆరాధనా మా హృదయక్షాళనార్థమే.

శ్రీరంగ : మరి నా తృప్తి - ?

లోక : మాకవసరము - మాకభీష్టము.

శ్రీరంగ : నాకు సంతుష్టిలేని ఎడల?

లోక : మా గుండె బరువెక్కుట తథ్యము.

శ్రీరంగ : మీ పూజలు మీ కొరకే !

లోక : అది సత్యము!

శ్రీరంగ : నేనీడ ఉండుట మీ కొరకే!

లోక : అది నిర్ణయము !

శ్రీరంగ : నా అస్తిత్వార్థము మీ అభిమతము.

లోక : అది నిశ్చయము. గుడి మేము. విగ్రహము నీవు. మనము దేవాలయము. నీవు మాకయి-

శ్రీరంగ : సరే! అంగీకరించితిని. నేను మీకయి ఉంటినంటివి కదా! మీకయి ఉన్న నన్ను, నాకోర్కెను, మీరు మన్నించక తప్పదు.

లోక : నీకయి జీవించు మేము చేయు మనవి నీవు వినక తప్పదు!

శ్రీరంగ : వినని పక్షాన ?

లోక : మా హృదయాలయాన నీకు చోటులేదు.

శ్రీరంగ : నేనీ ఆలయాన వేంచేసి ఉండని సందర్భాన ?

లోక : ముప్పది మూడుకోట్ల దేవతలున్నారు !

శ్రీరంగ : మీ హృదయభక్తి?

లోక : మారక తీరదు.

శ్రీరంగ : అది అంత చంచలమా?

లోక : భక్తి స్థిరమే! దేవుడే చంచలుడు! సుస్థిరుడు కాని దేవుడు మారునంతే! భక్తిమారదు.

శ్రీరంగ : నేనీడలేనినాడు మీకు స్థితిలేదు. గతిలేదు.

లోక : మే మీడలేనినాడు నీకు అధారము లేరు ఆలయము లేదు.

శ్రీరంగ : మీరు నా మీద ఆధారపడి జీవించుచున్నారు. ఇదంతయు నా అనుగ్రహమే !

లోక : కాదంటిమా స్వామీ? కాని ఈ ఆలయములో నీవు మమ్మాధారము చేసికొని వెలసితివి.

శ్రీరంగ : ఈ ఆలయము లేకున్నను నేనుందును.

లోక : మాకుండవు. మాకై ఉండదలచినచో ఈ ఆలయముననే ఉండవలె. ఈ ఆలయము మా హృదయాలయము, అందువల్ల, ఆవశ్యకమే. ఆలయమనగా మేమే! నీ వున్నది మా కొరకు, మా కొరకు కాని పక్షాన నీ విక్కడ ఉండవు; అందువల్ల మా భక్తి నీకు బంధిఖానా. నిన్నిక్కడనుండి కదలనీము. బైటికిపోనీము. ఇతరులను లోనికి రానీము. అది మా యిష్టము. నీ యిష్టమునకిక్కడ చోటులేదు. కాని. నీ యిష్టము మా అభీష్టాంతరముగా ఉండవలసినదే! మేము వినా నీకు ప్రత్యేక అస్తిత్వము ఇక్కడలేదు. ఇది మా హృది. ఇది నీ ఖైదు. ఇది దేవాలయము. మలినము కారాదు. నీ కోరిక మా కోరిక భేదించినచో తీరునది మా కోరికే - తీర్చునది మేము కాబట్టి ! నీ కోర్కె కూడ తీర్చగలము. ఎప్పుడనగా, అది మా కభిమతమయినప్పుడు! ఇది, నీవన్నది, మా కిష్టము కాదు. కనుక తీరదు. ఏమైనను కానిమ్ము!

శ్రీరంగ : మీ ఆలయము మీద మీ ప్రేమ మీ వరకు న్యాయమే!

లోక : అదియ మాట.

శ్రీరంగ : నా భక్తుని మీద నా ప్రేమ నావరకు ధర్మమే!

లోక : పంచముడు కాని మీ ప్రతి భక్తుని పైన మాకు కూడ ప్రేమే!

శ్రీరంగ : పంచముడేమి పాపము చేసినాడు?

లోక : మా నీతిని నీవు ప్రశ్నించరాదు. ఇది లోకాచారము.

లోక : మునీ! తిరుప్పాణ్‌నకు నేను ప్రత్యక్షము కారాదు. అతని పాదధూళితో దేవాలయమ అపవిత్రమయి పోరాదు. అంతే కదా!

లోక : అదే విషయము. అతడిక్కడకు నడువరాదు.

శ్రీరంగ : ఏ విధముగానయిన నేను నా భక్తుని దర్శించు కోరిక తీర్చుకొన వచ్చును కదా!

లోక : ప్రత్యక్షము కాకుండ, దివ్యముగా -

శ్రీరంగ : దానికిదే మార్గము మునీ! రేపు ఉదయము, సూర్యోదయాత్ పూర్వమే తిరుప్పాణ్‌ను నాపూజకు నీవు నీ భుజాలమీద మోసి తీసికొనిరమ్ము !

లోక : దేవా! దేవాధిదేవా!

శ్రీరంగ : ఇక మీ ఆలయ పావిత్ర్యము సురక్షితము!

లోక : దేవా! శ్రీరంగధామా !

శ్రీరంగ : అప్పుడు కదా, తిరుప్పాణ్ కోరిక, నా నిరీక్షణ ఫలించుట!

లోక : దేవా! నీ నిరీక్షణ నా కిష్టమే!

శ్రీరంగ : తిరుప్పాణ్ అభీష్టమే కష్టమా ?

లోక : అది నాకనిష్టము కాదు.

శ్రీరంగ : మరి?

లోక : ఈ భుజాలు కావేరీ తీర్థభాండ సంభరణ సంభావితాలు.

శ్రీరంగ : సత్యమే!

లోక : దీప ధూప నైవేద్యాది నిత్య పూజా పునస్కార పురస్కారాలు!

శ్రీరంగ : వాస్తవమే!

లోక : ఆ భుజాలకా ఈ శిక్ష?

శ్రీరంగ : అది సత్కారము.

లోక : పంచముని మోయుట?

శ్రీరంగ : అది నా భక్తుని స్పర్శ సుఖము!

లోక : పంచమ స్పర్శ ప్రాణాంతకమే!

శ్రీరంగ : మునీ! నీ కోరికలన్ని మన్నించితిని. నేనెన్ని అంగీకరించినను నీవు అన్నింటిని తిరస్కరించుచుంటివి. ఇక నీ ప్రయోజకత్వమునకే పరీక్ష!

లోక : స్వామీ! బలహీనుని పైననా–

శ్రీరంగ : బలహీనతపైన! రేపు తిరుప్పాణ్‌ని మోసి తెమ్ము!

లోక : తేలేను! – నా జీవిత శరీరాలు పవిత్రీకృతాలు. నేను పంచముని స్పర్శతో అపవిత్రము కాలేను.

శ్రీరంగ : నా ధ్యాన దీక్షవల్ల తిరుప్పాణ్ నిర్మలీమసమూర్తి!

లోక : అతని జన్మ మపవిత్ర దోషదూషితము.

శ్రీరంగ : జన్మవల్లకాదు, కర్మవల్ల పవిత్రతాపవిత్రతలు ప్రవర్తిల్లుట. తిరుప్పాణ్ పవిత్రుడు.

లోక : కావచ్చు. కాని మోసి తెచ్చుట నాకు కర్తవ్యము కాదు.

శ్రీరంగ : నాకయి, నీకీ విధి తప్పదు.

లోక : నీకయి, ఇదికాక ఏదయిన నాకభీష్టమే!

శ్రీరంగ : నీదా? నాదా? ఏ అభీష్టము ముఖ్యము?

లోక : (గొణుగుతూ) నీదే!

శ్రీరంగ : ఇక నీ అభీష్టమిట ప్రవర్తిల్లదు. ఉషోదయమే మీ ఉభయుల ఆగమనము. నిరీక్షించుటే నా కర్తవ్యము.

( శ్రీరంగనాథుడి ముఖం ఎర్రగా మారింది )

లోక : దేవా! ఏమా ఎరుపు! నీ నేత్రాలు రక్తారుణిమాలు! నీ ముఖమిట్లు చూడలేను, భరించలేను.

( శ్రీరంగనాథుడి నుదుట రక్తం )

శ్రీరంగా ఏమీనెత్తురు? నా నేరమేమి?

( శ్రీరంగనాథుడి నుదుట రక్త ప్రవాహం )

ఏమీగాయము? ప్రభూ! నా దోషమేమి?

లోక : ప్రభూ! నేనా నిన్ను నొప్పించుట? ఇదెక్కడి అన్యాయము వరాత్పరా! ఆ రక్త ప్రవాహము చూడలేను! ఆపగలనా పరంధామా?

శ్రీరంగ : ఆపగలవు .

లోక : ఆజ్ఞాపించు దేవా! రక్త ప్రవాహముపసంహరించు తండ్రీ!

శ్రీరంగ : వాగ్దానము చేసినచో-

లోక : ఏమని?

శ్రీరంగ : తిరుప్పాణ్‌ను మోసి తెచ్చెదనని!

లోక : అయ్యో! అదేమి ప్రవాహము! ఆ రక్తము భూదేవి భరించలేదు దేవా! ఆ నెత్తుటి బొట్టు నేల రాలిన ధరణి దహించుకొని పోగలదు తండ్రీ!

శ్రీరంగ : వాగ్దానము ?

లోక : అదేమి రక్త ప్రవాహము? వాగ్దానము చేసితిని. ఉపసంహరించు దేవా! అయ్యో ! నెత్తురు! తిరుప్పాణ్‌ను భుజాలపై మోసి తీసికొని వచ్చెదను. మాట ఇచ్చితిని దేవా! ఆపుమరుణారుణ దర్శనము.

శ్రీరంగ : మీ దర్శనమే, రేపు అరుణోదయ దర్శనము.

లోక : తమ ఆజ్ఞ!

( శ్రీరంగనాథుడు నిష్క్రమించాడు )

లోక :

నీకయి ప్రాణము పొందితి
నీకయి నా బ్రతుకు నిట్లు నిలుపుచునుండన్
నాకయి నీవిటు వచ్చుట
నాకయి నీవింత శిక్ష నలదుట తగవా?
రాకరాక నీవు రాగానె నా గుండె
గంతులిడుచు నాడకడగె గాని
కోరరాని దాని కోరినంతనె దేవ
గుండె జారిపోయె కోర్కెకూలె
నీ కోరికనే తీర్చెద
నీ కోపమునే భరించి నిలువంగలనా?

నీ కొరకీతని నేమిటి
ఏ కష్టమునైనన జేతు నిలపై ఇకపై !
అంటరానివాని నటుమోసి తెచ్చెదన్
అవని చూడ గుడికి అందజేయ
అంటరానివాని నంటుట యేమిటి?
ఎత్తు కొందు గుండె కొత్తుకొందు
నన్ను ధన్యు జేయ నా యన్న నీరాక
భక్తితోడ నేను ప్రస్తుతింతు
నాకు నంటుగూర్చు నా తండ్రి నీ కోర్కె
తీర్చువాడ గుడికి చేర్చువాడ

(తెర)

(తెరలో)

వేదవేద్యుడు :

ఇక తిరుప్పాణ్ విశిష్ట భావైక నిష్ఠ
లోక సారంగముని పుణ్యలోక మగుచు
ఇదిగో శ్రీరంగనాథుడే ఇలకు నడిచి
భక్త సందర్శనార్థమ్ము పాటుబడెను.

సృష్టి చేయగగోరి వ్యష్టి జీవులగూర్చి
స్త్రీమూర్తి నర్థించి చెలువుమించి,
భక్త సందర్శనాస్తక మనస్కతన్
పూజారి నర్థించి పుడమి వెలిగి
దుర్మార్గ జీవులన్ తుదముట్ట కడతేర్చ
అవతార మర్థించి యవని దిరిగి
సన్మార్గ రక్షణన్ సమకూర్ప దిగవచ్చి
భూమిపై జీవించి ప్రేమబొంది.

విశ్వజీవుల తేజమ్ము వెల్లివిరియ
నేల బ్రతికెడు మనుజుల మేలుకోరి

సర్వ శుభముల సంతోష సమితినిచ్చు
దేవ దేవుండు వెలుగొందు దివ్యుడతడు
సర్వచేతనా చేతన జగతి యంత
ఎవని గుండెలో నిండుగా నిమడబడునొ
సర్వ మానవ చైతన్య సంఘమంత
ఎవని భావ సామ్రాజ్యాన నెగసి పడునొ
సర్వ జీవుల సంతుష్ట సఖ్యమంత
ఎవని ఎదుట సాష్టాంగమై ఇలకు పడునొ
సర్వలోకాల మాధుర్య సత్యమంత
ఎవని పాదాల ప్రణమిల్ల నిష్టపడునొ
అట్టి విష్ణుండు పూజారి నడిగికొనుట
ఏ పురాపుణ్య ఫలము ప్రేమించు కొనుట?

# పంచమాంకం

ప్రథమ రంగం - కావేరీ తీరం

- తెరలో -

తిరుప్పాణ్ :

దేవా ననుకావ దిగిరావ ?
దివినుండి భువిపైకి ననుచేర దిగిరావ ?
నీకన్ను నాకున్న రవిబింబమేనయా
నీ కాంతి నా శాంతి నాకిచ్చునే సదా ॥దేవా॥
శ్రీరంగనగరిలో పూరంగులే నీవు
నీ పట్టుపుట్టాన కాంతులే ఈ నేల ॥దేవా॥
నిను నాకు చూపించు కనులిమ్ము శ్రీరంగ
నను నీకు నర్పించు కరమిమ్ము నా రంగ ॥దేవా॥

( లోకసారంగముని ప్రవేశించాడు )

లోకసారంగముని :

శ్రీరంగనాథుండు శిల నిల్పుమనివేడ
శిలనిల్పి గుడి ప్రతిష్ఠించినాను
శ్రీరంగనాథుండు సేవించమనిచెప్ప
సేవించి బ్రతుకు కాజేసినాను
శ్రీరంగనాథుండు శిక్షించమని తెల్ప
శిక్షించి శక్తి వీక్షించినాను
శ్రీరంగనాథుండు శివమీయుమనికోర
శివమిచ్చి ప్రజల రక్షించినాను.

పూజ కడుపున పుట్టి, అపూర్వభక్తి
నెరిగి, నైష్ఠిక జీవన నీతి నేర్చి,
శుద్ధ చైతన్య తత్త్వ సంసిద్ధి పొంది
నియమ గమ్యాన జీవించు నేను నిజము

దివిలోని విష్ణువే భువిలోన ప్రాంజియై
ప్రభవించు వేదాంత పరిధి నెరిగి

పరలోక దీప్తులే నరలోక కాంతులై

వెలుగొందు జీవాత్మ విధమునరసి

గుడిలోని దేవుడే గుడిబైట భక్తుడై

పలికించు పరమార్థ పథము తెలిసి

మడిబట్ట తత్త్వమే పొడిబట్ట చుట్టమై

కడబట్టు ప్రాణాల కతలనెంచి.

వంచితమతులై వ్యధల జీవించువారు

తిలకమందెదు శుభము గుర్తించినాను

కన్ను లిచ్చిన రంగన్న నన్ను పిలిచి

చూపులిచ్చుట కనులార చూచినాను.

( తిరుప్పాన్‌ని సమీపించాడు )

మహాభక్తా, తిరుప్పాణ్ !

తిరు : దేవా! నన్ను పిలిచినావా !

లోక : ఇటుచూడు - నిను !

తిరు : మునీశ్వరా! చూడరాని నన్ను చూచితిరే! పిలువరాని వాని పిలచి ధన్యత కలిగించితిరే!

లోక : మహాకవీంద్రచంద్రా! శ్రీ మహావిష్ణువు నిన్నాశీర్వదించినాడు.

తిరు : ఎంత చల్లని మాట! ఇదెంతటి ధన్యత !

లోక : ధన్యత నాది తిరుప్పాణ్! శ్రీ మహావిష్ణువు నాకనుగ్రహించినాడు. (తిరుప్పాణ్ భుజం తాకాడు)

తిరు : నన్ను తాకుట, మీ అమృత హస్తముతో! ఎంత సుఖమీ స్పర్శ!

లోక : నిన్ను తాకగా, నాకెంత హాయిగా నున్నది !

తిరు : అంటరాని నన్ను అంటి మీరు మలిన దేహులు కారాదు మునీంద్రా!

లోక్ : మలిన మనస్కుల భావనమే మలిన దేహము ! నీది పరిశుద్ధ తేజము తిరుప్పాణ్ !

తిరు : ఏమి నా భాగ్యము! మీ అదరము లభించిన నేను భాగ్యవంతుడను.

లోక : భాగ్యము నాది. ఆనందము నాది. అదృష్టము నాది. త్రిలోక పూజ్యుడు, త్రికాలవేది, త్రిమూర్తి తత్త్వనిధి శ్రీ మహావిష్ణు వర ప్రసాదము నాది. నీవు ఆలయ ప్రవేశము చేయ రావలెను.

తిరు : నేనా?! శ్రీరంగనాథ దేవాలయమా?!

లోక : అవును.

తిరు : నాదేభాగ్యము! కాని మునీంద్రా! అది సాధ్యమా !

లోక : దైవ కార్యమునకు అసాధ్యమేమున్నది?

తిరు : నేనంటరానివాడను కదా!

లోక : అటుల శ్రీమహావిష్ణువు భావించలేదు.

తిరు : మీరు రానీరు......

లోక : మేము రానీము - కాని తీసికొని పోగలము!

తిరు : నేను రాలేక, మీరు తీసికొనిపోవుటెట్లు?

లోక : మోసికొని పోవుట.

తిరు : ఎవరు?

లోక : నేను!

తిరు : ఎవరిని?

లోక : నిన్ను!

తిరు : అదెట్లు సాధ్యము?

లోక : నా భుజపీఠిపై నీవు అధివసించిన సాధ్యమే!

తిరు : అది న్యాయమా?

లోక : దైవకార్యము!

తిరు : మీకు సమ్మతమా?

లోక : దైవేచ్ఛ!

తిరు : ఇది సంభవమా?

లోక : సంభవమే! గత్యంతరము లేదు.

తిరు : నేను రాగలనా ?

లోక : రాక నీకు తప్పదు.

తిరు : దేవా! ఇదా నీ లీల? అంటరానివాడను, ఆలయమే అపవిత్రము చేయులేనివాడను. మీ భుజాలమీద - శ్రీరంగరంగా - నాపల్లకాదు.

లోక : నీవు పంచముడవే! అలయ ప్రవేశము నిషిద్ధమే! నీవు- భక్తుడు - భగవంతుని దర్శించుట న్యాయమే! శ్రీరంగనాథుడు నిన్ను చూడగోరినాడు! అది ఆజ్ఞ! ఆ కోర్కె తీర్చుట నా విధి. అందుకిదే మార్గము. నీవు నా భుజాలమీద గుడిచొచ్చిన దోషమంటదు. మైలలేదు. శ్రీరంగనాథుని కొరకు, నీ ఆశకు, నా విధికి సాఫల్యము.

తిరు : పవిత్రులను అపవిత్రులుగా చూడలేను.

లోక : ఉచితానుచితత, పవిత్రతాపవిత్రత, ధర్మాధర్మకర్త శ్రీమహావిష్ణువు. నాకేమి నిమిత్తములేదు. నీవుచూచి బాధపడవలసిన దేదియును లేదు.

తిరు : చూడరాని పిలవరాని తలచరాని తాకరాని పంచముడు శ్రీరంగనాథ దేవాలయ ధర్మకర్త, బ్రాహ్మణోత్తముడు, లోకసారంగ మునీశ్వరుల భుజాగ్ర పీఠినధివసించనొన గూడుట - దేవా, ఇది నీ వినోదమా! ఇది నీ విలాసమా - దేవా ఇది నీ విలాసమా?

ఇది నీ వినోదమా - దేవా
ఇది నీ విలాసమా

వెన్న ముద్దలను మింగిన స్వామీ
వెన్నెల యమునలో దాచినవాడా
పిల్లనగ్రోవికి ప్రాణము నూదుచు
చల్లగ గుండెలు తట్టిన రేడా ! ॥ఇది॥

గోవుల మేతలు వెదికినవాడా!
గోపిక మానము నిలిపినవాడా!
గొల్లల బ్రతుకుల వెన్నెలలూదుచు
పల్లము లన్నిటి పూడ్చిన రేడా ! ॥ఇది॥

రాతిని నాతిగా మలచినవాడా
లంకకు స్వర్గము నిచ్చినవాడా
రక్కసి రాజ్యము చిక్కులు దీయుచు
చక్కగ జీవుల నేలిన రేడా! ॥ఇది॥

- తెర -

- తెరలో -

వేదవేద్యుడు :

విష్ణు భక్తి మహిమ విశ్వ విశాలమై
వినగ కనక నిపుడు వీలుకలిగె
భక్తి జనుల కోర్కె పరమాత్మ రూపమై
అవని తేజరిల్లు ననుట జరిగె

సత్యమై నిత్యమై సకలమ్ము పుణ్యమై
ప్రభవింప జీవించుపథమె యతడు
ధర్మమై న్యాయమై ధన్యాత్మ తేజమై
వెలుగొందు నరనారి వేకువతడు
వీరమై విజయమై విలసిల్లు ధ్యానమై
దీప్తించు జీవాళి కాప్టుడతడు
ప్రాణమై ప్రణవమై పరికించు భక్తియై
రూపొందు జనుల స్వరూపమతడు.

తీవ్ర భక్తి దీప్తి తేజరిల్లిన చోట
కాలుమోపు చిన్న కన్న డతడు
మ్లాన హీన దీన మానవ దుఃఖమ్ము
విలయ మొందజేయు విష్ణువతడు.

దైవ సంకల్ప బలమెంత ధర్మయుతమొ
విష్ణు భుజియించు ఫలమెంత విశ్వనుతమొ
జనుల పూజించు కృషియెంత శ్రద్ధగతమొ
సర్వజీవుల కవగత సత్యమాయె.

అవని ఎవని కోర్కె అంత తీరకనుండు
నతడు విష్ణుభక్తుడైనవాడు
పుడమి నెవని భక్తి పుణ్యమందకనుండు
నతడు భక్తి వశుడునైనవాడు.

గుడిలో కోరిక నాతడు
నడచిన దోషమగునంచు నవ్వెడు జనులీ
మదినేమందురు? విధినె
వ్వవడు కాదననగు తదీయ భాగ్యము కలుగన్?

# పంచమాంకం

ద్వితీయ రంగం - శ్రీరంగనాథ దేవాలయం

( లోకసారంగముని, భుజాలమీది తిరుప్పాణ్‌తో, దేవాలయంలోనికి ప్రవేశించాడు)

లోకసారంగముని :

అటు పుణ్యమటు ధర్మమటు సత్యమార్గమ్ము
శ్రీరంగ రంగయ్య చీదరాల్ప
అది పాట అది ఆట ఆది నాకు మేల్కొల్పు
శ్రీరంగ రంగయ్య చిక్కుదీయ
ఇట కాంతి ఇట శాంతి ఇట దివ్యమనుభూతి
శ్రీరంగ రంగయ్య చీకు మాన్ప
ఇది మాయ ఇది క్రీడ ఇది నీకు తగునయ్య
శ్రీరంగ రంగయ్య చింత దీర్ప

పాత సంప్రదాయ పరిణామ జీవమై
బ్రతుకుచుంటి వెలుగు వెతుకుచుంటి
కొత్త దీప్తి వెలసి క్రొన్నెల తలదాల్చి
సాగుచుంటి గుడిని మ్రోగుచుంటి

( నిర్విరామంగా గుడిగంటలు )

దేవదత్తుడు : లోకసారంగ మునీశ్వరులు తిరుప్పాణ్‌ను మోయుచు గుడి చొచ్చుట ఎంత ఆశ్చర్యకరము !

వేదవేద్యుడు : నీకింకను మాయ పొరలు తొలగినట్లులేదు. అది మహా భక్తుని మునీంద్రులు సేవించుట. తిరుప్పాణ్ భక్తి ఎంత పారవశ్య ప్రదాయకము! పాటలెంత మధుర సుస్వర సుందరాలు!

దేవ : అవి పాటలా? స్వర్గంగా తరంగాలు, నాకధునీ శీకరాలు. నేను ఆ పాటలను అక్షర బద్ధము కావించెదను. అవి భవిష్యజ్జనాళికి విష్ణుపాదోజ్జ్వల సాహిత్య సంప్రదాయ వారసత్వ సౌందర్యాలు.

వేద : ఆ ఆలోచనే నీ అస్తిత్వమునకు అర్థము, పరమార్థము. తిరుప్పాణ్ ముఖమెంత వెలుగుచున్నదో చూడు! ఆ వెలుగెల్ల కాలము నిలువ నీ సాహిత్యమే మార్గము. మహాకవి తిరుప్పాణ్ ఆవేశమే నీ అక్షర రూపము. అది ఇక విష్ణు సాహిత్యము.

తిరు : శ్రీ మహావిష్ణు! శ్రీరంగనాథా! శ్రీపరంధామా! నా రంగధామా! నీ అనుగ్రహమునకు అవధిలేదా తండ్రీ! నీ దయ హద్దులెరుగదా దేవా! ఇంత భాగ్యమీ నశ్వర శరీరము భరించగలదా! ఇంత అదృష్టము నే నందుకోగలనా పరత్పరా! శ్రీరంగ రంగ రంగా!

లోక : నాదికదా తరించిన జన్మము! నాదికదా పరమానంద జీవనము. శ్రీ మహావిష్ణువు కోరిన భక్తుని, తిరుప్పాణ్ ఆశించిన శ్రీరంగనాథుని దర్శింప చేయగలితిని. భుజాల మీద భక్తుని మోయుటెంతటి అదృష్టము!. (తిరుప్పాణ్‌తో) కదలవద్దు - దిగవద్దు. నీ దేవుని కనులార చూడు. ( శ్రీరంగనాథునితో ) ఇదిగో నీ భక్తుడు, దర్శన సుఖమేమి - శ్రవణ సుఖ మనుభవింపుము.

తిరు : అమలుడా - నీ భక్తులకు సేవకుడును. నిర్మలుడా - నీ దాసులకు దాసుడను. దేవా! దేవదేవా! దేవాదిదేవా! వేంగడ పర్వతాగ్రప్రభూ! నిర్మలుడా, నీతిమంతుడా, నిత్యుడా, నిర్వికల్పుడా! నిరంజనుడా! దేవా! నా నయన పద్మాలు నీ పాద పద్మాలతో తాదాత్మ్యము, తాద్రూప్యము పొందుచున్నవి తండ్రీ!

వేద : ఇదేమి ఆవేశము! ఇదేమి భక్తి రసావతారము!

దేవ : ఎన్నో తరాలుగా దేవుని సందర్శింపలేని జాత్యావేదన ఏకీకృత రూప మితడు. తిరుప్పాణ్ ఒక వ్యక్తికాదు, వ్యవస్థ!

లోక : ఈ భక్త్యావేశావేగమీ అస్థిపంజరము తట్టుకోలేదు దేవా! తిరుప్పాణ్ ! నీవు నీ దైవముతో తప్ప మాతో మాటాడవా? సరే, కానిమ్ము !

తిరు : ముల్లోకాలుదాటి, ఎల్లలోకాలు దాటి, విశ్వాంతరాళాల కెగబ్రాకెడు విరాడ్రూపా! బ్రహ్మాది దేవదేవతా పూజిత పాదపద్మా! శాతబాణ సంహృత రావణాసురా! పరిమళోద్యాన శ్రీరంగప్రభూ! నీకింశుక చేలాంచలములో నా ధ్యానము లగ్నమయినది తండ్రీ!

( తిరుప్పాణ్ తల కనిపించదు )

లోక : నా బరువు తగ్గుచున్న దేమి దేవా!

తిరు : వేంగడాగ్రోత్తర ప్రాంగణ నివాసప్రభూ! నరవానర ముని దేవతా జన హృదయస్థ దేవదేవా! బ్రహ్మకు జన్మస్థానమౌనీ కటికలంకృతమైన ఉదయ సంధ్యాకాంతి పట్టు పుట్టము నా ఊపిరి, హృదయములను నుద్రూత లూగించి తనలోనికి పిలుచుకొనుచు పీల్చుకొనుచున్నది తండ్రీ!

(తిరుప్పాణ్ ఉరస్థలి కనిపించదు )

లోక : మహర్షీ! మహాత్మా! మహాభక్తా! మా కనుల పండిన తపస్స్వరూపమా! నీవెంత ధన్యుడవు!

తిరు : వార్ధివర్ణదేహా! శాతబాణ ఖండిత దశకంఠా! బలవత్తమప్రాకార పరివేష్టిత లంకా విజేతా! పరాజిత లంగాధిపా! శ్రీరంగ ప్రభూ! సుందరమై, సురుచిరమై, స్వలంకృతమై నీ నడుము నా ప్రాణ చైతన్యమును స్వాధీనము కావించుకొనుచున్నది ప్రభూ!

లోక : ఏమి నాబరువింత తగ్గినది! ఇది నా బరువా! తిర్పాణ్ బరువా? దగ్గినదేది? ఇదేమిమాయ?

దేవ : మహాకవీ! నీతల ఏది? నీ మెడ ఏది? ఎక్కడివీ మాటలు?

తిరు : నా పాపాలు తుడిచితివి నీవు. నిన్ను ప్రేమించితిని నేను. అందుకే నా గుండె గుడిని గర్భగుడి చేసికొనినావు నీవు. దేవా! ఈ గుడినెట్లు నిలుపుకోగలను? నేనెట్టి కఠిన విశిష్ట తపశ్చర్య చేయగలను? తెలివిలేనివాడను. మూఢుడను. అమ్మ లక్ష్మి అందము వనమాల. లక్ష్మీవనమాలాలంకృతోరస్థలీ సముజ్జ్వల సౌందర్య రేఖ నన్ను దాసుని, దాసానుదాసుని చేసినది దేవా!

వేద : నీ ఉరస్థలిపై ఊర్ధ్వదేహమేమయినది తిరుప్పాణ్? నీకు నా మాట వినబడుటలేదు. మాకు నీ వాక్కు పరమ సుఖముగా నున్నది!

లోక : శ్రీరంగరంగా! నీ పాదాలనుండి నడుముదాక ఇదేమి నూత్నకాంతి స్వామీ!

తిరు : సర్వపర్వత శ్రేణితో లోకాలన్నిటిని, ఊర్ధ్వలోక విషమును ప్రళయకాలములో దిగమింగిన దొరా! నే నేమైన వెర్రివాడనా? తుమ్మెదల ఝుంకారముతో విలసిల్లు పుష్పోద్యాన ప్రభూ ! శ్రీరంగధామా! చంద్రమౌళి పాపక్షాళన తత్పరా! భూలోక విముక్తిని, స్వర్లోక సంప్రాప్తిని ప్రసాదించు, నీ సుందర కంఠము కౌగిలించు కొందునా దేవా!

లోక : నీ తిరుప్పాణ్‌ను నీలో చేర్చుకొనుచుంటివా ప్రభూ!

తిరు : శేషతల్ప శాయివయి శ్రీరంగమున కలంకారమైన తండ్రీ! తులసిమాలతో, సర్వతంత్ర స్వతంత్రాధికారముతో వెలిగెడి నీలవర్ణదేహా! శంఖచక్రధారీ! నీకన్న విచిత్రుడెవడు? నీ అధరోజ్జ్వల చైతన్యరేఖ నన్ను సర్వతంత్ర పరతంత్రుని చేయసాగినది దేవా!

వేద : తిరుప్పాణ్! శ్రీరంగనాథుని కనులార కనుగొన ఇంతకాలము ఉవ్విళ్ళూరిన నీవు తృప్తితీర ఆపాదమస్తకము అభివర్ణించుకో!

దేవ. : తిరుప్పాణ్ దృష్టి ప్రభువు పాదపద్మములలో లగ్నమగు టెంతటి వైచిత్ర్యము?

తిరు : హిరణ్యకశపు సంహారా! దేవతా సంరక్షకా! అన్నింటికి మూలమైన దేవా! పవిత్రుడా! పరమాత్ముడా! ఎర్రని రక్తరేఖలతో పొడవైన కనురెప్పల నీ నల్లని కనుదోయి నను బంధించినది ప్రభూ! (తిరుప్పాణ్ కనిపించడంలేదు)

లోక : లోకరక్షకా! తిరుప్పాణ్‌ను నీలో రక్షించుకొనుచుంటివా తండ్రీ!

దేవ : వేదవేద్యా! తిరుప్పాణ్ శ్రీరంగనాథునిలో ఐక్యమయిపోయినాడు. ఈ భక్తుని నయనాలు భగవంతుని పాదాలలో ఐక్యమయిపోయినవి.

వేద : దేవదత్తా! శ్రీరంగనాథునిలో తిరుప్పాణ్ తలక్రిందులుగా ఐక్యము చెందుటే వింత!

తిరు : అతులిత సౌందర్య ప్రభారాశితో ప్రకాశించుచు వజ్రవైడూర్య మాలలతో పూజా పునస్కారాలతో విలసిల్లుచు, శేషతల్ప శాయిగా శ్రీరంగమలంకరించుచున్న తండ్రీ! సప్తలోకాలు దిగమింగిన వటపత్రశాయీ! దైవీయబాలకా! నీ నీలవర్ణ దేహముతో నా దృక్పథమంతయు నిండిన దేవా!

లోక : తిరుప్పాణ్ ! నీవు నా భుజాలమీదికెక్కి దిగకుండ నీ దేవుని చేరినావు కదా!

వేద : దేవా! శ్రీరంగనాథా! తిరుప్పాణ్‌ను నీలో చేర్చుకొనినావా ప్రభూ!

దేవ : భగవాన్ తిరుప్పాణ్! నీవు మాకు కనిపించుట లేదు. మాట వినిపించుటే ఉన్నది! మనీషిలేని మాట. ఆకారములేని వాని శబ్దము సుశబ్దము! కలకాలము మిగిలెడి శబ్దము! జీవి కలవరము వినిపించు శబ్దము! శాశ్వతమైన శబ్దము!

తిరు : నోటినిండ వెన్నముద్ద – మేఘశ్యామ దేహము – అలకాపరి – చీరె దొంగ నా గుండెదొంగ – శ్రీరంగరంగా – నా తండ్రీ! నా అన్న! నా కన్న! శ్రీమహావిష్ణు! నా దేవా! నా తండ్రీ! నిన్ను చూచిన కనులు అన్యమేమి చూడవు తండ్రీ! నిన్ను చూచిన కనులు అన్యమేమి చూడవు తండ్రీ!

దేవ : శ్రీరంగనాథా! మానవుని దేవుడు తనలో కలుపుకొనుట మాకు చూపితివా దేవా! ఇదే సుఖము, ఇదే శాంతి, మాకీ సుఖశాంతులు చాలు.

వేద : తిరుప్పాణ్! మానవుడే మాధవుడని నీ జీవితము మాకు బోధించినది. మేము ధన్యులమైతిమి!

లోక : తిరుప్పాణ్‌కు నీ తనువున చోటిచ్చిన శ్రీరంగనాథా! ధన్యోస్మి! నీ దేవుని చేరిన తిరుప్పాణ్ – ధన్యుడవు! ఇదా నీ లీల శ్రీరంగనాథా – నూత్న రోచిస్సుందరదేహా! పాహిమాం. తిరుప్పాణాళ్వారూ! ధన్యజీవి! నమోస్తుతే – నమోస్తుతే!

ధన్యజీవీ తిరుప్పాణాళ్వార్

దైవజీవీ తిరుప్పాణాళ్వార్

ధర్మజీవి తిరుప్పాణాళ్వార్

మట్టిలోన పుట్టినట్టి మనుజమాత్రు డెరిగినట్టి
సత్యమేమి? ధర్మమేమి? సర్వజీవి తత్త్వమేమి?
మట్టి మణిగ వెలిగినట్టి అడవి వనిగ పెరిగినట్టి
తీరులేమీ? తెన్నులేమి? తీర్థ ప్రజల దీక్షలేమి? ॥ధన్య॥

మనుజుడైనవాడె నేడు మహితశక్తియైనమాట
అంటరానివాడె చూడు మునివాహనుడైన బాట
మానవత్వ మిలను నేడు మాధవత్వమందగనుట
తత్త్వమేమి? నిత్యమేమి ? సర్వజగత్ సత్యమేమి? ॥ధన్య॥

అన్ని ఉన్న మునీశ్వరున కందకున్న దీక్ష ఏమి?
ఏమిలేని వెర్రివాని నందుకొన్న శక్తియేమి?
ఇదే సృష్టి పరిణామము?! ఇదే ధర్మపరిణామము?!
ఇదే తత్త్వ పరిణామము?! ఇదే విశ్వ విధి తేజము?! ॥ధన్య॥

భక్తుని వేదన చూడగ
శక్తుడ దేవుడు విశేష శాంతతనైనన్?
భక్తుని దుఃఖము తీర్ప ని
యుక్తుడు దేవుడు వినీతి యుత మార్గమునన్.

ఎవడు ప్రజలు మేల్కొంచ ప్రార్థించినాడో
ఎవడు జీవి చైతన్య మర్థించినాడొ

ఎవడు సమదృష్టి పుడమి కల్గించినాడొ
వాడె భక్తుండు దేవుండు వాడె నరుడు.

దీక్ష కలుగునాడు దివ్యమ్ము చేజిక్కు
భక్తికలుగ దివియె పట్టువడును
తపము చేయువాడు ధర్మమ్ము పరికించు
పూజవలన పుడిమి తేజరిల్లు.

కులము గోత్ర మంచు గోలపెట్టెడు జాతి
పెరుగలేదు, గుండె పెంచలేదు
హెచ్చు తగ్గులందు పెచ్చుమీరెడు జాతి
మనగలేదు, శాంతి కనగలేదు

నీతి నియమాల పేరిట జాతి నాడు
ముక్క చెక్కలై దీనతన్ చిక్కుకొనెను
జనులు నందురు నొక్కటై మనగ గలుగు
మంచిరోజులకొరకు ప్రార్థించనగును.

పరమాత్మ తేజమ్ము పరికింపవచ్చునే
పరమార్థ దృష్టి పైబడక యుండ
ఇలవేల్పు సౌందర్య మీక్షింపవచ్చునే
చింతనామృత దీప్తి చిలుకకుండ

భగవాను పరిపూర్ణ పరిణామమబ్బునే
పరలోక శక్తి కాపాడకుండ
దైవ సన్నిధి దివ్య భావాలు కల్గునే
ప్రేమ పెన్నిధులు రావింపకుండ

సర్వ జీవులెవడు సమముగా పరికించు
నతడె దివ్యుడతడె ఆత్మదీప్తి
సర్వసమత నెవడు సతతమ్ముకోరునో
అతడె పుణ్యుడతడె ఆత్మవేత్త

– తెరలో –

భరతవాక్యం

ఈ తిరుప్పాణ్ ప్రకాశమే యిలకు మిగుల
పిలచి శ్రీ రంగనాథుండు వెలుగునట్లు
సర్వ సామాన్య మానవ శక్తి పొంది
ప్రజల ప్రతినిధుల్ జనుల కాపాడుగాక !

– తెర –

# ఉన్నమాట

హైందవ మతంలోని రెండు ప్రసిద్ధ శాఖలు వైష్ణవం, శైవం. వైష్ణవం వీరవైష్ణవంగా, శైవం వీరశైవంగా ఆంధ్రదేశంలో విశృంఖల విహారం చేశాయి. అవి మత వైశిష్ట్యంతోపాటు చారిత్రకంగా సాంఘిక వైరుధ్యాలకు, తన్ముఖంగా చైతన్యానికి కారకాలు ప్రేరకాలై ప్రాధాన్యం పొందాయి. అంతేకాకుండా ఆంధ్ర సాహిత్య సామ్రాజ్యం అవిచ్ఛిన్నంగా పాలించాయి. తెలుగు సాహిత్యం అయితే వైష్ణవంగా, కాకపోతే శైవంగా చెలామణి అయింది. వైష్ణవంలోని సారస్వత విషయమే ఈ సందర్భంలో సాహిత్య విద్యార్థికి సంబంధం.

ఆళ్వారుల సంప్రదాయం వైష్ణవంలోని ఒక ప్రధానాంశం. వాళ్ళు పన్నెండు మంది. వాళ్ళలోని ప్రముఖుడు తిరుప్పాణ్. పేరులోని తిరు శ్రీకి వికృతి. పాణ్ కులం. అది ఒకనాడు స్పృశ్యకులమే. అనంతర కాలంలో అస్పృశ్యకులంగా మారింది.

పాణ్ కులస్థులు సంగీతవేత్తలు, సంగీతప్రియులు, వాద్య సంచాలకులు, వాద్యప్రయోక్తలు. ప్రధానంగా వీణావాదన నిపుణులు. మొదట్లో వీళ్ళు రాజాస్థానా లాశ్రయించుకొని జీవించారు. గౌరవాలు, గౌరవభృతులు పొందారు. ఆ రోజుల్లో వీళ్ళు అంటరానివాళ్ళు కారు.

సంగీత సంబంధంవల్ల వీళ్ళకు నటవిట గాయకులతో సామీప్యం సాహచర్యం కలిగాయి. రాజనర్తకులతో మైత్రి వీళ్ళను దాంపత్య జీవితంవైపు నడిపింది.

కళలు రాజాస్థానం నుంచి దేవాలయాలకు ప్రయాణమైనప్పుడు కళాకారులు కూడా బయలుదేరి వచ్చారు. దేవాలయాలలో దేవదాసీలకు వీళ్ళు తోడునీడగా మిగిలారు. వైష్ణవాలయాలలో దేవదాసీలు, శైవాలయాలలో బసివిరాండ్రు భోగకాంతలుగా మారినప్పుడే కళావంతుల స్థితి దిగజారిపోయింది. అప్పుడు వీళ్ళు అస్పృశ్యులయ్యారు.

ఆళ్వారైన తిరుప్పాణ్ జీవితం ఈ సంధి యుగానికి పరిమితం. తిరుప్పాణ్‌కు గీతి మాధుర్యం తెలుసు, సంగీతజ్ఞానం ఉంది. పాడే గొంతుంది. ఆడే మనసుంది. కొన్ని వందలేళ్ళ పూర్వం తనవాళ్ళు తిలకించిన విష్ణుమూర్తిని పరికించే కోర్కె ఉంది. ప్రణుతించే ఆశ ఉంది. శ్రీరంగంలో వెలసిన శ్రీరంగనాథుణ్ణి తనివితీరా దర్శించి, నోరార సుత్తించి, తిమ్మిరి దిగేట్లునర్తించే అభీష్టముంది. అవాంతరాన్ని ప్రతిఘటించే ఆత్మాభిమానముంది. ఇంతేకాక, ఇంతకాలం బ్రతికిన బానిస జీవితం నేర్పిన మర్యాద ఉంది. మన్నన ఉంది. పిరికితనం

ఉంది. పెడసరం ఉంది. భయం ఉంది. భక్తి పెరిగింది. ఈ దశలో తిరుప్పాణ్ సంప్రదాయ ప్రతిఘటనకు ప్రతీక.

భక్తే తిరుప్పాణ్‌గా పరిణమించిన దశ నాటకంలో ప్రసక్తం. తిరుప్పాణ్ నామాంతరం మునివాహనుడు. లోకసారంగముని శ్రీరంగనాథ దేవాలయం పూజారి. మునివాహనంగా కలవాడయిన తిరుప్పాణ్ మునివాహనుడయ్యాడు. ఈ నాటకేతివృత్తం ఇదే! వీళ్ళిద్దరూ చారిత్రక వ్యక్తులు. శ్రీరంగనాథుడు మతనేపథ్యంలో చైతన్యమూర్తి. వేదవేద్యుడు, దేవదత్తుడు కల్పితపాత్రలు. కావేరి నాటికీ నేటికీ ఉన్న నదీలలామ. శ్రీరంగనాథ దేవాలయం ఏనాటిదో, ఈనాటికీ పూజలందుకొనే పుణ్యక్షేత్రం.

నాటకం ప్రాచ్య పాశ్చాత్య సంప్రదాయాలలో రచనా ప్రక్రియ. పంచసంధుల పంచావస్థల అర్థప్రకృతుల ప్రాచ్య నాటకరీతి కానీ, ప్రారంభోచ్ఛస్థిత్యవసంహారాల పాశ్చాత్య నాటక విధానంకానీ, ప్రధానంగా వస్తువు ప్రారంభం రసోన్మీలనోన్ముఖత్వం ఫలాగమోపసంహారం వంటి సంధిబంధ సుందరం కావటమే వివరించాయి. ఈ దృష్టితో పరికిస్తే ప్రాచ్య పాశ్చాత్య నాటక వికాసం విశదమవుతుంది.

రెండింటి మేలి గుణాలు పుణికి పుచ్చుకొని ప్రాచ్యరీతికి సమీపస్థంగా 'మునివాహనుడు' నాటక సృష్టి జరిగింది. అవసరమైన సందర్భాలలో సంప్రదాయం మీద ప్రయోగమూ జరిగింది.

నాటకంలో శృంగారం కాని, వీరంకాని అంగిరసం కావాలని ఆర్యోక్తి. నాటకాంగిరసంగా భక్తిని అంగీకరింపకపోయినా, అది రసమే కాదన్నా దాని ఉనికికి భంగంలేదు. వద్దన్నా వినకుండా హాస్యం అంగిరసంచేసి తెలుగులో నాటక, నాటికలు వందలుగా వ్రాశారు నాటకకర్తలు.

వీరం యుద్ధ వీరమే కానక్కరలేదని సహృదయులకు తెలుసు. దాని చతుర్విధాలకు తోడు మరో విధానం అనుసంధిస్తే ప్రమాదం రాదు. తిరుప్పాణ్ వీరుడైతే లోకసారంగముని ప్రతివీరుడుగా గోచరం కావచ్చు.

శృంగారం స్త్రీ పురుష విషయికమేనని సిద్ధి ప్రసిద్ధి. శ్రీరంగనాథుడు శృంగార నాయకుడుగా కనిపించే సందర్భంలో తిరుప్పాణ్ భక్తి నాయికారూపం ధరించే అవకాశం ఎవరయినా భావించవచ్చు. ఇది తీరుబడి కోరే సదాలోచన.

తిరుప్పాణ్ చుట్టూ జీవుడి ఆర్తి ఉంది. అది భక్త్యావేశ్యంగా, ఉత్సాహంగా, మహేచ్ఛగా విభిన్న స్థాయీ ప్రవిభేదాలు సంతరించుకొంది. ఒక్కటి మాత్రం సత్యం. భావశాబల్యం ఈ

నాటక ప్రాణం. అందువల్ల విభిన్న ప్రాంగణాల నుంచి నాయక చర్చ, రస చర్చ వంటివి సాధ్యమవుతాయి. వాటికి అనుకూలంగా నాటకంలో భావాలు, విభావాలు, అనుభావాలు సంచారీభావాలు సముద్భూతమయి గోచరమవుతాయి.

విశ్వవిద్యాలయాలలో పఠన పాఠన పరిశోధనలు వ్యావహారిక భాషలలో చాలా వరకు సజావుగానే సాగుతున్నాయి. పాఠ్యాంశాలు కళాశాలల్లో గ్రాంథికంగానే ఉంటున్నాయి. ఈ నాటకం కళాశాల విద్యార్థుల పాఠ్యాంశ దృష్టితో రూపొందింది. రచన గ్రాంథికంగానే ఉన్నప్పటికీ వ్యావహారానికి దగ్గరగా ఉండే రూపం గ్రహించే ప్రయత్నం జరిగింది. నాటక కర్త మాటలు వ్యావహారికమే! భాషావిషయికంగా తీసుకొన్న జాగ్రత్త స్వేచ్ఛ సహృదయులు గుర్తించవచ్చు.

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో తిరుప్పాణ్ భవనానికి పునాదిరాయి వేసే సందర్భానికి కలిసి వచ్చేటట్లుగా నాటక రచన చేయమని ప్రోత్సహించినవారు విశ్వవిద్యాలయానికి నాటి ఉప కులపతులు ప్రాచార్యులు కొత్త సచ్చిదానందమూర్తిగారు ఆకాశవాణి హైదరాబాదు వారు సంగీత రూపకంగా నాటక సప్తాహంలో దీనిని ప్రసారం చేశారు.

ఆ పైన మునివాహనుడు నాటకం శ్రవ్యంగాకాక దృశ్యంగా రూపొందవలసిన అవసరం తెలిసివచ్చింది. మార్పులు చేర్పులు జరిగాయి. దృశ్య కావ్య ధర్మం విస్తృతమయింది.

పాతికేళ్ళు కళాశాల్లో, విశ్వవిద్యాలయాలలో నాటకం పాఠం చెప్పిన అనుభవం పరిశోధనంలో నాటక విషయకమైన ఆలోచనవల్ల కలిగిన అభిప్రాయం. నాటక రచయితగా దర్శకుడిగా, నటుడిగా ప్రయోగ గతమైన భావం దృష్టిలో ఉంచుకొని, నాటక ధర్మం శ్రవ్యగుణం, దృశ్యతత్త్వం మేళవించుకొని, నాటకం రూపొందించే ప్రయత్నంలో మునివాహనుడు సిద్ధించింది.

తిరుప్పాణ్ ఆత్మార్తి ప్రకటనంలో పాటల అవసరం సహృదయులు గ్రహిస్తారు. కథాగతికి భంజకం కాకుండా పద్యం ఒదిగి ఒదిగి నిలిచింది. మోదాంతమయిన మునివాహనుడు నాటకం పండితుల ఆమోదం, విద్యార్థుల ప్రమోదం, సామాజికుల సమ్మోదం పొందగలిగితే అదృష్టవంతుణ్ణి.

అనంతపురం　　　　　　　　　　మీ

12. 12. 1984　　　　　　　　కొలకలూరి ఇనాక్

# మరోమాట

మునివాహనుడు నాటకం రచించింది 1976లో. అప్పటికి ఒకటిన్నర దశాబ్దం. ఈ మధ్యకాలంలో ఇది సంతరించుకొన్న సాహితీ సత్కారం సదవకాశమే!

ఆరంభంలో ఇది అరగంట సంగీత రూపకం. ఆకాశవాణి ప్రసారార్థం ఉద్దిష్టం. ఆకాశవాణి ప్రయోక్తకు ఇది గంట నాటకం కావాలని అభీష్టం. అందువల్ల ఇది అభివృద్ధి చెందింది. ఆకాశవాణి నాటక సప్తాహంలో 12.6.1978న హైదరాబాదు కేంద్రం సమర్పణంగా ప్రసారమయి శ్రోతల అభిమానం పొందింది. 30.6.78 హిందూ పత్రిలో " Munivahanudu a musical broadcast by the Hyderabad Station, was very good. Written by Kolakaluri Enoch, it narrates how, Tiruppan, an untouchable becomes a religious man.

The lyrics were well composed. Music was by Palagummi viswanatham. Lokanatha Sarma (Tiruppan) and Ravivarma (Archaka) sang well and rendered the dialogue with import"

1984లో బోర్డ్ ఆఫ్ ఇంటర్ మీడియేడ్ ఎడ్యుకేషన్ ఆం॥ ప్ర॥ హైదరాబాదు ఇంటర్ మీడియేట్ విద్యార్థులకు పాఠ్యాంశంగా పెట్టడానికి యోగ్యమయ్యే నాటకం కావాలని పోటీ నిర్వహించింది. పౌరాణిక చారిత్రకం కలగలసి నట్లుండే మునివాహనుడు సంగీత రూపకం అన్ని హంగులతో, లక్షణబద్ధంగా సంప్రదాయ నాటకంగా రూపొందించాలన్న ఆలోచనకు ఈ పోటీ ప్రకటన దోహదం చేసింది. శ్రీ పి. రామారావు, శ్రీ పి. వెంకటరత్నం ప్రోత్సాహం కూడా ప్రేరణే అయింది. తత్ఫలితంగా మునివాహనుడు సంప్రదాయ నాటకం రూపొందింది.

ఇక్కడ వివరించవలసిన అంశం ఉంది. వైష్ణవమత నేపథ్యంలోని భక్తుడు అళ్వారు తిరుప్పాణ్. ఆ భక్తి మార్గంలో కీర్తనం ప్రముఖ విషయం. తిరుప్పాణ్ కీర్తనం గీతి మాధుర్యం సంతరించుకొన్న సత్ సందర్భం లోక ప్రసిద్ధం. కాబట్టి పాటకు ప్రాణం వచ్చింది. పాట నాటకంలో ప్రాణ ప్రతిష్ఠ పొందింది.

తిరుప్పాణ్ భక్తీ, తన్నిరోధమూ, తత్ప్రతిఘటనా, తత్సాధనా విశేషనాటకీయతా విలసనంగా ఉండటంవల్ల నాటకం సంపూర్ణతను సాధించుకొంది. ఆ సంపూర్ణత్వం వల్లే సలక్షణ సంప్రదాయ నాటకంగా అవతరించింది. నాటకీయత వ్యాప్ృతం అయ్యేటప్పుడు వస్తురంజకంగా ఇతివృత్తం విస్తరించుకొంటే నాటక లక్షణాలు ఒదిగి ఒదిగి వచ్చిచేరాయి.

ఈ చేరటంలో ప్రాచ్యనాటక లక్షణాలేకాదు, పాశ్చాత్య నాటక లక్షణాలు కూడా కలగలసి వచ్చాయి. వస్తువు ఇతివృత్తంగా మారి నాటకంగా అభివ్యక్తమయ్యే సందర్భాలలో దోహదకారులుగా మారిన నాటక లక్షణాలు పరిచిత సాహితీ ప్రపంచం నుంచి వచ్చి పనిగట్టుకు చేరాయి. ఏ లక్షణమయినా వస్తుదృష్టితో ప్రతిబంధకంగా ఉంటే పరిహరింపబడింది. ఏ లక్షణమయినా అవసరమయితే, ఏ సంప్రదాయం ఆంగీకరింపకపోయినా వచ్చి చేరింది. ఈ స్వాతంత్ర్యం సంప్రదాయ ప్రాంగణంలో ఈ వస్తువు తేవలసివస్తే, తీసుకోక తప్పదని స్పష్టమయింది. ఈ స్పష్టత కార్యరూపం ధరించింది. అందుకే ప్రయోగం తప్పనిసరి అయిందని తెలపటం. ఈ దృష్టితోనే నాయకుడు, రసం వంటి ప్రధాన నాటకంగాలే చర్చనీయాంశాలని వివరింపవలసి వచ్చింది.

మునివాహనుడు నాటకంలో నాయకుడు ఎవరు? శ్రీరంగనాథుడా! తిరుప్పాణా! ఈ చర్చ చాలా దూరం పోతుంది. అంగి రసం శృంగారమా? ఆలోచనకు అంతు ఉండదు. కాకపోతే భక్తి అని చెప్పవచ్చునా? చెబితే భక్తి రసంగా నిర్ణయించట సాధ్యం కాదుకదా! ఆలంకారికులు అంగీకరింపరు. రసదృష్టికి లక్షణ విరుద్ధంగా ఉంటుంది. భక్తికి రసస్థానం ఈయవచ్చునా? చెదురు మదురుగ ఉండే లక్షణ దోహదం పొందవచ్చునా? వాద సామర్థ్యం ఏమోగాని వాది సామర్థ్యం కావాలి. వీరం అంటే సాధ్యమేనా? నాయకుడు, ప్రతినాయకుడు ఉన్నారా? ఉంటే ఇది యుద్ధ వీరం కాదుకదా! స్థాయీభావం ఉత్సాహంగానే ఉంది కాబట్టి వీరమే అంటే ఏం వీరం? దయా వీరం, దాన వీరం, ధర్మవీరం, త్యాగవీరం చెప్పినట్లుగానే భక్తి వీరం చెప్పవచ్చునా? అంగిరసంగా సంప్రదాయం అంగీకరించే వీరం చెబితే, ఆ సంప్రదాయమే అంగీకరించని భక్తిరసాన్ని కానీ భక్తి వీర రసాన్ని కాని స్థాపించే ప్రయత్నం చేయాలి.

ఎందుకింత ప్రయత్నం చేయాలి? ముఖ్యం వస్తువు. వస్తుగతమయిన నాటకీయత. అది రూపొందిన ఇతివృత్తం. ఈ ఇతివృత్త దర్శనం నుంచి ప్రసిద్ధేతివృత్తం మిశ్రమేతివృత్తం చేయటంలో రూపెత్తే నాటకీయతకు సర్వనాటక లక్షణాలు సహకరించి వచ్చి సర్దుకొంటాయి. ఈ సర్దుబాటులో వస్తువు నాటకమయిం తర్వాత అది ప్రయోజనకారి అయితే లక్షణ పరామర్శ ఆవశ్య కర్తవ్యమే. ఈ నాటక నిర్మాణంలో ప్రాచ్యమెంత, పాశ్చాత్యమెంత, ప్రయోగమెంత, నాటక కర్త స్వేచ్ఛ ఎంత – పరిశీలించవలసిందే.

1985 లో మునివాహనుడు పోటీలో 36 నాటకాలలో ప్రథమంగా గుర్తింపు పొంది పాఠ్యాంశమయింది. ఇది మూడేళ్ళు ఇంటర్మీడియేటుకు నాటకంగా ఉంది. ప్రతి సంవత్సరం దాదాపు ఐదు లక్షలమంది విద్యార్థులకిది పాఠ్యగ్రంథం. మూడేళ్ళు రవీంద్ర

పబ్లిషింగ్ హౌస్, గుంటూరు, మునివాహుణ్ణి అలంకరించి, అందంగా ముద్రించి ఆంధ్ర దేశమంతా అందించి ఆనందించింది. ఇంతమంది విద్యార్థులు, వేలకొలది అధ్యాపకులు మునివాహనుడు నాటకం చదవటం, చదివించటం, చెప్పటంవల్ల నాటక పఠన ప్రయోజనం చాలా నెరవేరింది. కొన్నిచోట్ల ప్రదర్శించటం వల్ల కొద్దిగా ప్రయోగ ప్రయోజనం కలిగింది. అధ్యాపకులతో పాటు సాహితీవేత్తలు, నాటక కర్తలు, దర్శకులు, నటులు మునివాహనుణ్ణి పరిశీలించారు, పరీక్షించారు, ప్రయోగించారు. అందువల్ల మునివాహనుడు విశేష ప్రాచుర్యం పొందింది.

అర్థ తాత్పర్యాలు చెప్పటమే పాఠం చెప్పటంగా భావించే సోదర అధ్యాపకులు నాటకంలో కఠిన పదాలు లేక కష్టపడ్డారు. నాటక వస్తువు, ఇతివృత్తం, పాత్రవైశిష్ట్యం, రచనాశిల్పం, నాటకీయత, సాంఘికావసరం తెలిసిన అధ్యాపకులు విద్యార్థులకు తెలిపి సుఖపడ్డారు.

నాటకం చదివి అధ్యాపకుల్లోనూ, విద్యార్థుల్లోనూ, సహృదయుల్లోనూ వైష్ణవ మతధర్మం ఇష్టమయిన వాళ్ళు విశేషంగా ఆనందించారు. వైష్ణవ మత ధర్మదృష్టిలో ఆనందం తప్ప పఠితృలోకానికి అన్యం అనుభవంలోకి రాలేదు. ఇది హరిజనుల విషయంలో నిర్ద్వంద్వంగా లేదు. కొందరు హరిజనులైన అధ్యాపకులూ, విద్యార్థులూ నాటకం చదివి పట్టరాని ఆనందంతో పరవశులయినట్లే, మరికొందరు పాఠం చెప్పటానికి, వినటానికి ఇబ్బంది పడ్డారు. నాటక వస్తువు కలిగించే ఉత్తేజం సాంఘిక చైతన్య కారకమవుతుందని చాలామంది సంభావించారు. వెష్ణవులంతా అంతగా పొంగిపోవటం అదృష్టం. హరిజనుల్లో కొందరు కుంగిపోవటం దురదృష్టం. ఈ అదృష్ట దురదృష్టాలు నాటక వస్తువుతో సంఘానికున్న సత్ సంబంధం స్పష్టం చేస్తున్నాయి.

ఏటేటా అధునికాంధ్ర సాహిత్య ప్రక్రియలో ఒక్కొక్కదానికి ఒక్కొక్క బహుమతి ఇచ్చే ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రణాళికను కొనసాగిస్తున్న తెలుగు విశ్వవిద్యాలయం 1988లో మునివాహనుడు అర్హంగా గుర్తించి నాటక బహుమతి ప్రదానం చేసింది.

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలం, తిరుపతి, తెలుగు అధ్యయనశాఖలో, డా॥ కె. ఆనందన్ పర్యవేక్షణలో, శ్రీ పి. హేమచంద్ర బాబు " డా॥ కొలకలూరి ఇనాక్ నాటక సాహిత్యం " మీద పరిశోధనం చేస్తూ స్వీకరించిన ఆరు నాటకాలలో మునివాహనుడికి సముచిత స్థానమిచ్చి సిద్ధాంత గ్రంథం రూపొందించాడు. 1991లో పరిశోధకుడికి విశ్వవిద్యాలయం పి. హెచ్.డి. పట్టం ప్రదానం చేసింది.

శ్రీ కృష్ణదేవరాయ విశ్వ విద్యాలయంలో తెలుగు శాఖలో యం.ఫిల్ పి.హెచ్.డి., డిగ్రీల కోసం కృషిచేయ తలపెట్టిన అధ్యాపక మిత్రులు అనేకులు పరిశోధ విషయంగా మునివాహనుడు గ్రహించడానికి సంసిద్ధమయినట్లు మౌఖిక పరీక్ష నిర్వహించి సహాచార్యులు తెలిపారు. డా॥ ఏ. వీరప్రసాదరావు, ఆంధ్రోపన్యాసకుడు, పర్యవేక్షణలో ( డి.యస్. బషీర్, తెలుగు లెక్చరరు, ఉస్మానియా కళాశాల, కర్నూలు, యం.ఫిల్.పట్టం కోస " మునివాహనుడు " అంశంగా పరిశోధన చేయటానికి విశ్వవిద్యాలయం అనుమతించింద పరిశోధకుడు, తన సిద్ధాంత వ్యాసం విశ్వవిద్యాలయానికి 1991లో సమర్పించాడు. 199 యం.ఫిల్.పట్టం పొందాడు.

సాధారణంగా ఎంతో కొంత ప్రయోజనం సృష్టి పొందిన అన్నింటికీ ఉంటుంద మునివాహనుడు నాటకంవల్ల రచయితకు కలిగే ప్రయోజనం కాదు. చదవటం చదివించట ప్రదర్శించటం వల్ల కలిగే ప్రయోజనం. ఆనందం కలుగుతుందా? అంతకంటే ఏదై ప్రయోజనం ఉంటుందా?

ఏ పుస్తకమయినా ఎవరో చదవాలనే ఉద్దిష్టమవుతుంది. జనం దీన్ని రేడియో విన్నారు. నాటకంగా చదివారు. ప్రదర్శనంగా చూశారు. ఎందరో ఆనందించారు. వాళ ఆత్మ దఘ్నంగా పొంగిపోయారు. అందులో వైష్ణవులు, హరిజనులు మరీ అధికం సంతోషించారు. ఇది ఎవరికోసం ఉద్దేశింపబడింది?

సాహిత్యం ఎప్పుడూ భిన్నమార్గాలలో సాగుతూ ఉంటుంది. సమాజం ఎం విభిన్నంగా ఉంటే అంత విభిన్నంగా సాహిత్యం అవతరిస్తుంది. ఎటువంటి సంఘముం అటువంటి సాహిత్య ముంటుంది. సంఘం ప్రయాణం ఏకోన్ముఖంగా ఉంటే సాహిత్య తన్ముఖంగా సాగుతుంది. సంఘ లక్ష్యాలు భిన్న దిశల్లో ఉంటే, సాహిత్యం విభిన్న స్థితిగతు ఉంటుంది. ఇది గుర్తించే సందర్భంలో బిత్తరపోయిన సాహిత్యం కూడలిలో కూలబడుతుం వర్తమానాంధ్ర సాహిత్యమంతా విభిన్న మార్గాలలో ఉంది. కొంత సాహిత్యానిది వెనుకచూ కొంత సాహిత్యానిది ముందుచూపు. ప్రాచీన సాహిత్యమార్గంలో, సంప్రదాయపథంలో న సంప్రదాయ విధానంలో కొంత సాహిత్యం ఉంది. ఇది వెనుకచూపు. ప్రయోగ పరంపర అభ్యుదయ దృష్టితో విప్లవమార్గంలో కొంత వాస్తవికతా సాహిత్యం ఉంది. ఇ ముందుచూపు. ఈ సంప్రదాయ సాహిత్యానికి, ప్రయోగ సాహిత్యానికి చుక్కెదురు. సంఘం లాగే సాహిత్యంలో కూడా ఈ రెండు వర్గాలు సంఘర్షించేవర్గాలే. 'మునివాహనుడు' దే ప్రాతినిధ్యం వహిస్తుంది? వెనుకచూపుకా? ముందుచూపుకా? దీనివి సంప్రదాయ సాహి

లక్షణాలా? ప్రయోగ సాహిత్య లక్షణాలా? పోనీ ఇది రెండు సంఘర్షించే వర్గాలమధ్య సాహిత్య సమన్వయం సాధించే దృష్టితో ఉందా? మసిపూసుకున్న మారేడు కాయగా ఉందా? మేకవన్నె పులిగా ఉందా? రచయిత ఏదో అనుకుంటాడు. రచయిత అనుకోవటం ముఖ్యంకాదు. సాహితీ లోకం, లోకం అనుకోవటం ముఖ్యం.

అసలు సాహిత్యం వల్ల ప్రయోజనం ఏముటుంది? మతమా? హితమా? నీతా? ఆనందమా? సాహిత్యం కళేనా? కళ కళ కోసమేనా? లోకం కోసం కాదా?, కళ లోకం కోసం అయితే ప్రయోజనం ఏమిటి? ఆవేశమా? సాంఘిక చర్యా? మతావేశమా? భక్త్యావేశమా? మనిషి పరవశమా? మనిషి మౌఢ్యమా? సాహిత్యం సంఘం మీద ప్రభావం చూపుతుందా? సంఘంలో చైతన్యం కలిగిస్తుందా? సామాజిక స్పృహ కలిగిస్తుందా? పోగొడుతుందా? మునివాహనుడు వల్ల ప్రయోజనం ఏమిటి?

ఇన్ని ప్రశ్నలూ అవసరమే. సమాధానం చెప్పటానికి కాదు, చెప్పకుండా ఉండటానికీ అవసరమే. ఆలోచించి చెప్పటానికే కాదు, ఆలోచించి చెప్పకుండా ఉండటానికీ అవసరమే. ఇన్ని ప్రశ్నలెందుకు? సమాధానం నాటక కర్త చెప్పవచ్చుకదా? నిజమే - చెప్పవచ్చు. ఐతే అది నాటక కర్త జవాబేకాని సహృదయుల జవాబుకాదు. రచయిత సమాధానం కాదు, పఠితృలోకం సమాధానం ముఖ్యం. అది ఏకం, ఇది అనేకం. అది వ్యష్టి, ఇది సమష్టి. అది వైయక్తికం, ఇది వ్యావస్థికం. వ్యష్టికంటె సమష్టి ఎప్పుడూ విశిష్టం. వైయక్తికం కంటె వ్యావస్థికం ఎప్పుడూ ప్రముఖం. ఆ ప్రాముఖ్యం వల్ల ఆలోచించే సమష్టి, ఆచరించే వ్యవస్థ మరీ విశిష్టం. ఆ వైశిష్ట్యమే నాటక కర్త అభీష్టం.

# అంకితం

మా అమ్మ వీరమ్మ. పెళ్లిలో పేరు విశ్రాంతమ్మ. మా నాన్న కొలకలూరి రామయ్య. పెళ్ళి పేరు శాంసన్. మా అమ్మ స్వగ్రామం వేజెండ్ల. మా మాతామహుడి ఇంటి పేరు అదే. ఇది గుంటూరుకు దగ్గరలో ఉంది. మా నాన్న స్వస్థలం వేటపాలెం. ఇది చేబ్రోలుకు సమీపంలో ఉంది. మూడు తరాలకు పూర్వం మా తాతముత్తాతలు కొలకలూరు నుంచి వచ్చి వేటపాలెంలో స్థిరపడ్డారు. మా నాన్న ఇల్లరికం వచ్చాడు. అప్పటి నుంచి మాది వేజెండ్ల. మా అమ్మకు పన్నెండుమంది సోదరులు. మా మామలు, బావలు, పిల్లలు, పిల్లల పిల్లలు మొత్తం నూరు కుటుంబాలు ఉండవచ్చు. చాలామంది వేజెండ్లలోనే ఉన్నారు. నేను అనంతపురంలో స్థిరపడ్డాను. మా చెల్లెలు గుంటూరులో, నా తమ్ముడు గౌరిబిదనూరులో స్థిరనివాసం.

మేము ముగ్గురమే పిల్లలం. నేనూ, మా అమ్మడు మార్తమ్మ, మా తమ్ముడు నాగభూషణం. మాది నిరుపేద కుటుంబం. కూలీనాలీ జీవనం. మా నాన్న కష్టజీవి. మా అమ్మ కష్టజీవి. ఆశాజీవి. పగటికలలు కనేది. కలల్ని కల్లల్ని కానీని గర్వం ఆమె సొంతం. ఆమె కలలే ఆమె ఆశలు, ఆశయాలు. అమ్మ ఆశలే మా ఆకారాలు. మా వ్యక్తిత్వాలు, మా జీవితాలు.

గుంటూరులో స్కూలుకు పోతున్న పసిపిల్లన్ని స్కూలు సంచులతో పాటు బూట్‌లు, హేట్‌లు, టక్‌లు, టైలుతో చూచినతల్లి తన సంతానం కూడా అలా తయారు కావాలన్న ఆశనుంచి మేము అవతరించాము.

మా నాన్న నిరంతరం అమ్మకు అండ, ఆయువు. అమ్మ నాన్నకంటికి రెప్పలాగా మెలిగేది. మా నాన్న తక్కువగా మాట్లాడేవాడు. మా నాన్న మాటలు ఏవీ పెద్దవాణ్ణి నాకే గుర్తులేవు. ఆయనదంతా మౌనమే. మౌని, మహర్షి, ఋషి. కనుసన్నల్లో అమ్మ మెలిగేది. మా అమ్మ ఆశల్ని నాన్న మౌనంగా వినేవాడు. మౌనంగా అంగీకరించేవాడు. ఆశీర్వదించేవాడు. మా నాన్న నా పన్నెండో ఏట, చెల్లి ఏనిమిదో ఏట, తమ్ముడి నాలుగో ఏట, పరమపదించాడు. నేనప్పుడు ఫోర్తుఫారం. మా అమ్మకు అప్పుడు ముప్పై ఏళ్ళుకూడా లేవు.

మా అమ్మ నన్నింకా బళ్ళోకి పంపకముందే హేట్ బదులు తలగుడ్డ చుట్టేది. బూటు బదులు చెప్పులు వేసేది. టై బదులు చీరెపేలిక కట్టేది. టక్ చేసేది. బెల్టు బదులు మొలతాడు మెలిదిప్పి వేపపుల్ల పెట్టేది. స్కూలు వయస్సు కంటే ముందే మాకు పలకా బలపమే కాదు, సంచీ పుస్తకాలు సిద్ధం చేసింది.

అమ్మ మమ్మల్ని జీతగాళ్ళు కారాదని కోరింది. పేడ తీయరాదని, కసువు ఎత్తరాదని నిక్కచ్చిగా చెప్పింది. అన్ని పనులూ చేయించింది. ఆ పనులు మమ్మల్ని అంటుకోకూడదని హెచ్చరించింది. అన్ని పనుల చేతకావాలనేది. ఆ పనులే చేస్తూ ఉండరాదనేది. మేం పెద్ద ఉద్యోగాలు చాలా పెద్ద పెద్ద ఉద్యోగాలు చేయాలని అమ్మ ఆశ, ఆరాటం. బడికి పోకపోతే ప్రాణం తీసేది. వళ్ళు వాతలు తేలేవి. చదవాలి, అదే ధ్యాస. రాత్రీ పగలు చదువుకోవాలి. ఎక్కువగా ఆడుకోరాదు. ఇంటి పట్టునే ఉండాలి. వేగుచుక్క పొడవటం ఆలస్యం, నిద్రలేపేది. పుస్తకాల సంచి ముందు పెట్టేది. బుద్ధి ముట్టించేంది. చదువు కొంటున్నానన్న నమ్మకం కుదిరితేనే, తాను నిద్రకుపక్రమించేది.

నా బిడ్డలకు అన్ని పనులూ చేతనౌనని గర్వపడేది, పనులన్నీ నేర్పింది. మగ పిల్లలు ఆడపిల్లలు తేడా లేకుండా అన్ని పనులూ నేర్పింది. ఇంటి పనులు, వంటపనులు, పొలం పనులు అన్నీ నేర్పింది. అన్నిటికంటే ఎక్కువగా చదువుకోవాలి. చదువే ముఖ్యం. మా వాళ్ళలో సహజంగా ఉండే నీరసం, నిశ్శబ్దం, నిస్సత్తువ, నెమ్మది, సోమరితనం మాలోనుంచి మా అమ్మ హరించింది. ఆమె ఆవేదనలో ఇవి అంతర్ధానమైపోయాయి. నేను ఎన్ని రాత్రులయినా మేల్కొని ఉండే శక్తికి, దీక్షకు, మా అమ్మ పునాది. ఎంత పనయినా చేసే ఓపికకు, పట్టుదలకు పురుడు పోసింది మా అమ్మ.

మా అమ్మ ఆశకారణంగానే నేను బళ్ళో చేరాను. స్కూలులో, కాలేజీలో, యూనివర్సిటీలో చేరాను. ఇరవై ఏళ్ళు నిండక ముందే ఉద్యోగినయ్యాను. మా అమ్మ ఆశల వేగమే నా అభ్యుదయం. మాటలు వస్తున్న మాకు పాఠాలు చెప్పటం, నడక నేర్చుకొంటున్న మాకు పనులు నేర్పటం. అంతా తొందరే, అంతే తొందర మా జీవితాలను ఆశీర్వదించింది.

మేము జీవితంలో స్థిరపడటం మా అమ్మ కోరినట్లే జరిగింది. కులమతాల ప్రమేయంలేని నా వివాహమే కాదు, నా కూతురి వివాహం కూడా పరిపూర్ణంగా ఆశీర్వదించింది, ఆదరించింది, ఆదుకొంది, నిండు గుండెతో పులకించిపోయింది. తాను నాటిన మొక్కలు, తాను పెంచిన చెట్లు, తన ఎత్తుదాటి, చేతికందక, చూపుకందక, పెరిగి ఎక్కడెక్కడకో పోతుంటే ఎక్కడున్నా నలుగురికి నీడనిస్తే అంతేచాలని త్రికరణ శుద్ధిగా సంతృప్తి పొందింది అమ్మ.

మమ్మల్ని ఒడ్డున తీరుబడిగా కూర్చోబెట్టి తాను ప్రవాహంలో కొట్టుకుపోతూ తలమునకలవుతూ మాకు ప్రవాహం పరిచయం చేసింది. తాను ఒడ్డున కూర్చుని మమ్మల్ని ప్రవాహంలోకి నెట్టి, మేం పీడితులం తాడితులం, వంచితులం, పరాజితులం కావటంతోపాటు, సుఖించటం, ఆనందించటం, జయించటం, సాధించటం, కూడా చూచి, మా యీ జీవితాలను మా నుదుళ్ళ మీద వ్రాసింది.

ఆ రోజు గడిస్తే చాలనుకొనే మా కుటుంబాల నుంచి మమ్మల్ని వేరుచేసి, దూరంచేసి, చదివిస్తూ ఆ రోజుకాదు, ఆ ఏడుకాదు, ఆ జీవితం కాదు, ఆ తరంకాదు, ఆటేడు, ఇటేడు తరాలు ఎలా గడిచాయో గడుస్తాయో చూడమనేది. ఏడు తరాల ముందటి కొలకలూరి భుజంగరాయుణ్ణి గూర్చి ఏకరువు పెట్టేది. ఎన్నో గత జీవిత గాథలు ఉద్వేగంతో ఉత్సుకతతో ఊరించి ఊరించి చెప్పేది. జాగ్రత్తను బోధించి భవిష్యత్తు హెచ్చరించేది.

మా అమ్మ మాకు భవితవ్యాన్ని గూర్చి ఆశించే, కలలుగనే అవకాశం ఇచ్చింది. అందుకు పరిశ్రమించే ఆరోగ్యం ఇచ్చింది. మా అమ్మ తన పాలపునాది మీద మా శరీరాలు అందంగా ఆరోగ్యంగా నిర్మించింది. మాకు అభీష్టాలు కలిగేట్లు చేసింది. మా ఆశలు తీరే మార్గం సుదూరంలో చూపింది, పోరాటం నేర్పింది. నా జీవితం నిజానికి మౌనంగా ఎడతెగని పోరాటం. ఈ పోరాటం కొత్తనీరు. కొత్త నీటికి చేపలు ఎక్కాయి. చేపల సంచలనం నీటికి అందం తెచ్చింది. ఇవి నిలవనీరు కాకుండా చేసింది. మా అమ్మ మాకు ఎడతెగని హెచ్చరిక.

ఎంతటి దుఃఖమయినా సహించే సాహసం ఇచ్చింది. మా దుఃఖాలు మమ్మల్ని మింగేయకుండా ఉండటానికి మా సహనం సహాయపడింది. ఎంతటి శక్తినయినా తిరస్కరించే చైతన్యం కలిగించింది. ఎంతటి కన్నీటిని అయినా దిగమింగే ఓర్పును, ఓదార్పును ప్రసాదించింది. భవిష్యత్తును గూర్చి బంగారు కలలుకనే ధైర్యాన్ని ఇచ్చింది. కన్నీటికవతల ఉన్న కమనీయ సౌందర్యం చూచే అదృష్టం ఇచ్చింది.

అమ్మ, వినయంగా తలొంచుకోవటంతో పాటు నిటారుగా తల ఎత్తుకొని తిరిగే గర్వం కలిగించింది. అధికారానికి అణిగిమణిగి ఉండటమేకాదు నిరంకుశంగా తృణీకరించే తలతిక్క నేర్పింది. దొమ్మపొగరు ఊపిరిగా పీల్చే అహంకారం గుండెలనిండా నింపింది.

తన బాల్యం సుఖసంతోషాలతో అమ్మానాన్నలు, అన్నదమ్ములు, అక్క చెల్లెళ్ళ మధ్య గడిపిన తల్లి; సంసారంలో కష్టజీవిగా, కలలజీవిగా కాలం కంటికి కాటుక పెట్టిన అమ్మ, ముగ్గురు పిల్లల తల్లయి, ముప్పై ఏళ్ళయినా నిండకముందే పసుపు కుంకాలుపోతే, మాకోసం మా భవితవ్యం కోసం, కన్నీటిని దిగమింగుతూ, చెమటను చిందిస్తూ, రక్తానికి స్వప్న పట్టాభిషేకం చేసి జీవించిన అమ్మను తలుచుకొంటుంటే త్యాగం, అర్పణం అనే మాటలు ఎంత చిన్నవో తెలిసివస్తూ ఉంది.

చదువుకొంటూ పిల్లలు దూరమైనా, ఒంటరితనంలో కూడా చింతించని తల్లి; ఉద్యోగాలు చేసుకొంటూ పిల్లలు వెళ్ళిపోయినా, పుట్టి పెరిగిన ఊరును వదలని అమ్మ ; తన భర్తనే తన దగ్గరకు తెచ్చిన తన ఊరును ఊరటదీర చూచుకొంటూ, తాను కట్టకొన్న

ఇల్లు, తాను కొనుక్కొన్న పొలం, తన బంధుకోటిని వదలలేని మాతృమూర్తి, సొంత ఊళ్ళోనే అర్థికంగా హాయిగా ఉంటూ, తినా కుడవా ఉండి, పెట్టనూ పోషించనూ ఒనగూడి, సంతోషంగా ఉన్న మా సృష్టికర్త్రి ఎక్కడున్నా హాయిగా ఉందని ఆనందిస్తూ వచ్చామేకాని అమ్మ లేకపోనే మేమెంత నిరుపేదలమో, అప్పటిలో మాకు తెలిసిరాలేదు. అన్నీ ఉన్న మేము, అమ్మ లేక, ఏమీలేని నిర్భాగ్యులమయ్యాము.

అమ్మ అన్నింటినీ నిర్ణయించి, ఏర్పాటుచేసి గమ్యం చూపినట్లుగానే తన మృత్యువును కూడా నిశ్చయించుకొంది. తన పని ముగిసిందని తీర్మానించుకొంది. అన్ని విధాలా ఆరోగ్యం బాగున్న అమ్మ అన్నింటిని సర్దింది. పొలం కాగితాలు భద్రం చేసింది. ఇంటి పత్రాలు జాగ్రత్త చేసింది. చేలకు ఎకౌంటు లావాదేవీలు స్పష్టంగా తేల్చి ఉంచింది. ఇద్దరు కొడుకుల్ని ఉత్తరాల మీద ఉత్తరాలు రాసి పిలిపించుకొని వండి వార్చి వడ్డించి, తినిపించి అందర్నీ పేరుపేరున అడిగి సాగనంపింది. తాను చనిపోదలచుకున్న రోజున తలస్నానం చేసి, ఉతికిన పట్టుబట్టలు కట్టుకొని, మండుటెండలో బస్సెక్కి గుంటూరు పోయి, కూతురింటికి చేరుకొని, మజ్జిగ అడిగి తాగి కూతురు వళ్ళో తలపెట్టుకొని, మాట్లాడుతూ కళ్ళు మూసుకొని మళ్ళీ లేవలేదు.

అమ్మ నిర్ణయం ఎప్పుడూ నిరాటకంగా జరిగింది. దానిని ఎవరూ మార్చలేదు. తల్లిదండ్రులు, తోడబుట్టిన వాళ్ళు అందరూ ఆమె మాట చెల్లనిచ్చారు. భర్త ఆమె మాటకు ప్రాణం పోశాడు. కొడుకులూ, కూతురూ ఆమె మాటకు మాటరానివ్వలేదు. మనమళ్ళూ మనుమరాళ్ళూ మునిమనుమడు అందరూ ఆమె మాటను పాటించారు. చివరికి ఈ పసివాళ్ళలాంటి భగవంతుడు కూడా ఆమె మాటను బందాడుతూ అంగీకరించి మరణాన్ని అందించాడు.

తన ఆశలు ఆకృతి దాల్చటం, నడవటం, చిరంజీవులు కావటం కళ్ళారా చూచిన అమ్మ, కోరిన మరణం కోరుకున్నట్లే లభించి తనువు చాలించిన ధన్యజీవి. అమ్మ అదృష్టవంతురాలు, అమ్మను కోల్పోయిన మేమే దురదృష్టవంతులం. అమ్మ అనురాగం ఆత్మీయత ఆశలు అమ్మడికంటే, తమ్ముడికంటే నాలుగు ఎనిమిది సంవత్సరాలు అదనంగా అనుభవించిన నేను మరింత పేదవాణ్ణి. అమ్మ మరుపురాదు. మర్చిపోలేను. అమ్మ సత్యం. నా శరీరమంత సత్యం. నా జీవితమంత సత్యం. నా భవితవ్యమంత సత్యం. మా ఏడు తరాల భవిష్యత్తు మా అమ్మ స్మృతి. మా అమ్మ స్మృతికిది అశ్రుతర్పణం. అంకితం.

అనంతపురం
4.2.1992

కొలకలూరి ఇనాక్



Prof. Kolakaluri Enoch (1939) hails from an underprivileged family of Vejendla, Guntur dt. Unprecedented in his community, he rose to the positions of Professor of Telugu, Sri Krishnadevaraya University, Anantapur and then attained the coveted post of Vice-Chancellorship of Sri Venkateswara University, Tirupati, the duties of which he has performed with remarkable ease and dignity.

In his literary activity, spanning about five decades, he has written 39 works consisting of poetry, shortstory, novel, play, essay and literary criticism besides his research at doctoral and post doctoral level and subsequently he has completed 15 research projects and guided 42 scholars for Ph.D., and M.Phil., degrees.

As a social activist, he has concern for the common man, the untouchable and the woman and he has hoped to see them as equals to others in all matters, social, political and economic through his writings which are varied, versatile, prolific and stirring.

He travelled widely in India and abroad Some of his writings were translated into English, Hindi, Tamil and Kannada, besides his original English writings. There has been widespread research on various aspects of his works in Indian Universities.

A recipient of many awards, prizes and honours, Prof.Enoch has received A.P. Sahitya Akademi awards for **Vurabavi** (shortstory 1985) **Munivahanudu** (play 1987) and **Principle of Modern Literary Criticism** (1998) and he has been a member of numerous literary and learned bodies including Sahitya Akademi, New Delhi.